# జమీన్‌రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు * సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్ * మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

ESTD. 1930
Regd No. H. NL.18
సంపుటి 61 సంచిక 6
9-2-1990
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూ 1-50


## అనంతరాములు అస్తమయం

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మల్లు అనంతరాములు తీవ్రమైన గుండెపోటుతో 7 తేదీ సాయంత్రం హైదరాబాదులో అస్తమించారు. ఆరోజు ఉదయం కొత్తగవర్నరు శ్రీ కృష్ణకాంత్ ప్రమాణస్వీకారోత్సవానికి కూడా హాజరైనారు. ఆయనవయస్సు 48 సంవత్సరాలు. భార్య, ఇద్దరుకుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

వి. ఎల్ దళ్ళు. గా జీవితాన్ని ప్రారంభించిన అనంతరాములు రెండు సార్లు పార్లమెంటు సభ్యులయ్యారు; అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శిత్వం నెరపారు; డిసెంబరులో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షతను స్వీకరించారు. స్వయం ప్రతిభతో రాజకీయంగా ఎదిగిన వ్యక్తి. సంస్కారశీలి అనంతరాములు. జీవించివుంటే ఆయనఇంకెంత వున్నతస్థితికి వచ్చివుండేవారో! వికసిస్తున్న విలువైనపుష్పాన్ని త్రుంచి నేలపాలుచేసినట్లు,మృత్యువుఅనంతరాముల జీవితానికి అర్థాంతరంగా తెరవేసింది!

# నానుడులో పడిన విస్తరణ!

"ఎప్పటివలె కాదురా" అనే జావళీ ధోరణిలో ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి వ్యవహరిస్తున్నారు. స్టార్టింగ్ ట్రబుల్ వచ్చిందని కాంగ్రెసులో ప్రత్యర్థులు వ్యాఖ్యానిస్తున్నారు. సారాంశం ఏమైనా, మంత్రివర్గ విస్తరణ కావాలనే జాప్యం చేస్తున్నారనుకుంటున్నారు. ఆశిస్తున్నవారు పడిగాపులుకాస్తూ, అయినదానికీ కానిదానికీ చెన్నారెడ్డిని పొగిడేస్తున్నారు. మంత్రివర్గ విస్తరణ జరిపితే శత్రువులు పెరిగిపోతారని చెన్నారెడ్డి బాల్చారం చేస్తున్నారు. మొత్తంమీద వ్యవహారం నానుడు బేరంలో పడింది. ఢిల్లీ వెళ్ళి పిర్యాదులు చేసేవారుకూడా అర్థేలేరు. రాజీవ్‌గాంధీ ప్రస్తుతం బలహీనంగా నాయకత్వాన్ని కొనసాగిస్తున్నారు. కౌన్సిల్ వచ్చేవరకూ ఆగమని కొందరు దుస్సలహాలు యిస్తున్నారటకూడా!

ఒకవేళ చికిత్స నిమిత్తం విదేశాలకు వెళ్లడం ఖాయమైతే, నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి - సమరసింహారెడ్డి- రోశయ్యలు సమష్టిగా వ్యవహారాలు చూసుకోవలసి వస్తుందట.

గాంధీభవన్ ఒక శిబిరంగా ప్రత్యర్థి వర్గం బలపడదానికి శ్రమపడుతున్నారు. రాయలసీమ ఆందోళన చుస్సుమవి


రాజధాని రాజకీయాలు

. . .

మా ప్రత్యేక విలేఖరి


పోయింది. చెన్నారెడ్డి వయస్సును బట్టి మరీ ఆలశ్యంగా నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఇదివరకటి చెన్నారెడ్డి ఎలా మారిపోయాడో అని, రాజకీయ దుమారాన్ని ఆశించినవారు విస్తుబోతున్నారు!

. . .

మంత్రిమండలి చర్చలు బయట వెల్లడించకూడదంటారు. లోగడ మంత్రివర్గంలో ఏంజరిగిందో అప్పటి మంత్రులు, ఇప్పుడు చెన్నారెడ్డి మంత్రిమండలిలో వుంటూ, బహిరంగసభల్లో చెబుతున్నారు. ఫలానా అని ప్రస్తుతానికి బొబ్బరదురుకున్నా, ఉత్తరోత్తరా వీరు చెన్నారెడ్డి మంత్రిమండలిలో ప్రస్తుతం జరిగేచర్చలు వెల్లడించరని గ్యారంటీ ఏమిటి?

ఇటీవలం జపోలో ఆస్పత్రి ఎమర్జన్సీ విభాగం ప్రారంభిస్తూ ఆరోగ్యశాఖామంత్రి అమూల్య నిజాలంటూ చెప్పారు. లోగడ అపోలోవారు 30 ఎకరాలు అడిగితే, ఎన్. టి ఆర్. 7 ఎకరాలే యిస్తామన్నారట. కాదుకూడదంటూ తమవాళ మంత్రిమండలి సమావేశంలో నచ్చచెప్పి 30 ఎకరాలు ఇప్పించామని, తమకుతామే సర్టిఫికేట్ యిచ్చుకున్నారు అదీ సంగతి!

. . .

మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కరరావు చాలాకోపంగావున్నారు. చెన్నారెడ్డి ఆయనకు ఏమీ చోటు పెట్టదంలేదు. ఆ కోపంకాస్తా ఎన్. టి. ఆర్. పై చూపడం కూడా కనిపిస్తున్నది. ఇటీవలం పర్లెంకాబ్జీ కేసులో సాక్ష్యంయిస్తూ, ఎన్. టి. రామారావు అమెరికాలో గుండె ఆపరేషన్


—కొరవ 7వ పేజీలో




మన కొత్త గవర్నరుగా 7 వ తేది పదవిస్వీకారం చేసిన

**శ్రీ కృష్ణకాంత్**

శ్రీ కృష్ణకాంత్ అభ్యుదయ భావాలు గలిగిన మాజీ కాంగ్రెస్‌వాది: దేశభక్తిలేని అతి నిరాడంబరవ్యక్తి.

నూరేళ్ళు నిండనున్న గూడూరు పి. ఆర్. క్లబ్

# ఒకనాటి కాలక్షేప కేంద్రమే ఈనాడు విజ్ఞాన కేంద్రమైంది

క్లబ్ అనగానే ఒకవిధమైన చులకన భావం వ్యక్తమవుతుంది. పేకాట వగైరా దురలవాట్లు, తదితర వ్యసనాలకు నిలయాలనే చులకన భావం కలుగుతుంది. సాధారణంగా వ్యక్తమయ్యే అభిప్రాయం కూడా, క్లబ్బుల్లో అధికసంఖ్య ఈ కోవలోకే వస్తుంటాయి. కాని ప్రతిష్ఠాత్మకమైన, గౌరవప్రదమైన విధంగా లేకపోలేదు. మద్రాసులోని కాస్మోపాలిటన్ సభ్యత్వం ఎక్కడకు పోయినా విలువే, గౌరవమే! రోటరీ, లైన్స్ క్లబ్బుల వంటి



క్లబ్ స్థాపకులు
స్వర్గీయ పెళ్లేటి రామరెడ్డి



1989 క్లబ్ అధ్యక్షుడు
సి. వి. కృష్ణయ్య

అంతర్జాతీయ సంస్థల అంతస్తు వేరేననుకోండి!

నెల్లూరు క్లబ్బు, మెక్లీన్స్ క్లబ్బుల వయస్సు నాకు తెలియదు; కావలిలో ఇటువంటి పురాతన సంస్థ ఏదైనా వుందో లేదో కూడా తెలియదు కాని; గూడూరులోని పి. ఆర్. క్లబ్బు (పెళ్లేటి రామరెడ్డి క్లబ్బు) మాత్రం మరో ఐదేళ్లలో శతవార్షికోత్సవాన్ని జరుపుకోబోతున్నది. బహుశా జిల్లాలోని క్లబ్బులలో వయస్సులోనేకాదు, దినదిన ప్రవర్ధమానం కావడంలో సైతం గూడూరు పి. ఆర్. క్లబ్బే మొదటిదిగా వస్తుందేమో ననిపిస్తుంది.

నెల్లూరు మెక్లీన్స్ క్లబ్బు, ఆఫీసర్స్ క్లబ్బులలో కూడా టెన్నిస్ కోర్టులు అనాదిగా వున్నాయి; మాకు తెలిసి మెక్లీన్స్ క్లబ్ టెన్నిస్ కోర్టు ఎప్పుడూ విరామంలేకుండా వుండేది కాని గూడూరు పి. ఆర్ క్లబ్‌లో 1910 లో టెన్నిస్ కోర్టు ప్రారంభించేనాటికి, మద్రాసు రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో ఏర్పాటైన మొట్ట మొదటి టెన్నిస్‌కోర్టు అదేనట. అనాటికి



కొత్త అధ్యక్షుడు
డాక్టర్ సి. ఆర్. రెడ్డి

గూడూరు మునిసిపాలిటీ కాదుగదా,

—కారవ 11వ పేజీలో



గూడూరు పి. ఆర్. క్లబ్ భవనం

# మద్రాస్ స్టేషన్ నుంచి జీటి ఎక్స్‌ప్రెస్‌లోనూ నెల్లూరుకు టిక్కెట్టిస్తారట!

ఊరుపేరు లేకుండా నామకార్థం వుండే సంస్థలుకూడా, ఒక్కొక్కసారి కొందరు వ్యక్తుల నిర్వహణలో ఎంతటి జీవం సంతరించుకుంటాయో తెలుసుకోవడానికి, నె. జి. రైల్వే వినియోగదారుల సంఘం ఒక ఉదాహరణ. 1958 లో, 30 ఏళ్ళ క్రితమే నెలకొన్న సంస్థ ఇది. అయితే ఇదనేది ఒకటి నెల్లూరులో వుందని ఎప్పుడూ రైలెక్కి తిరిగేవారికి కూడా తెలిసేది కాదింతకాలం. ఎప్పుడూ రైలెక్కఎరుగని నిర్వాహకులుండి, ఎట్లాతెలుస్తుందిచెప్పండి!

పారిశ్రామికవేత్త శ్రీ జి బి కె. రెడ్డి, దుగార్ ఇన్వెస్ట్‌మెంట్స్ బ్రాంచి మేనేజర్ శ్రీ పి. వేణుగోపాలరావు కార్యవర్గంలో సభ్యులైన తర్వాత ఈ సంఘం నిర్వహణ తీరే మారిపోయింది. ఏ చిన్న సమస్యను, ఎవరు వారిదృష్టికి తీసుకపోయినా రైల్వే అధికారులతో పోట్లాట పెట్టుకుని మరీ పరిష్కరిస్తున్నారు. అటువంటిదే, మద్రాసు స్టేషన్‌లో టిక్కెట్ల సమస్య!

మెయిల్, జీటి, నవజీవన్‌వంటి సూపర్ ఫాస్ట్ రైళ్ళలో నెల్లూరుకు టిక్కెట్లివ్వరు; తెనాలికో, రామగుండానికో కాని నెల్లూరులో దిగవలసివస్తున్నది దీనిపై సంఘంసభ్యుల ప్రయత్నంవల్ల, అన్ని రైళ్ళలోనూ కోటాలున్నంతమేరకు నెల్లూరుకు టిక్కెట్లివ్వడానికి మద్రాసురైల్వే చీఫ్‌కమర్షియల్ సూపరింటెండెంట్ అంగీకరించారు.

మద్రాసుకు నిత్యంరాకపోకలుసాగించే వారు, ఆ అధికారి వ్రాసిన జాబును మద్రాస్ స్టేషన్ టిక్కెట్ కౌంటర్లలో చూపి, వినియోగించుకోవాలని; టిక్కెట్లివ్వకుండా ఇంకా ఎవరైనా ఇబ్బందిపెడితే మరొకసారి ఉన్నతస్థాయిలో ప్రయత్నం జరుపుతామని శ్రీ వేణుగోపాలరావు తెలియజేస్తున్నారు. ఆ జాబు జెరాక్స్ కాపీలు, కోమలలాడ్జి ఎదురుగావున్న రాఘవేంద్ర ఆటో జెరాక్స్‌లో, శ్రీ ఆసి హెచ్‌బాబుదగ్గరవున్నాయి. కావలసినవారు, తీసుకవెళ్ళవచ్చునట.

## సాయిబాబా మందిరంలో భారతోపన్యాసాలు

నెల్లూరు సాయిబాబా మందిరంలో జన 8 నుంచి 24 తేది వరకు భారతోపన్యాసాలు జరిగాయి. శ్రీ పునుగు శేషయ్య శాస్త్రి శ్రావ్యమైన కంఠంతో, స్వచ్ఛమైన ఉచ్చారణతో క్రోడంకు భారత కథను విశదపరచారు. చివరిరోజు మందిర పాలకవర్గం అయన్ను ఘనంగా సత్కరించింది.

## హైరర్స్ సంఘం బాడుగ పెంపు

పెళ్ళిళ్ళకు, సభలకు వస్తువులు బాడుగకిచ్చే హైరర్స్ అంగళ్ళవారు జిల్లా స్థాయి సంఘమేర్పరచుకున్నారు. పదేళ్ళ నుంచి మార్పులేకుండా వున్న బాడుగల ధరలను పెంచాలని ఈ సంఘం నిర్ణయించింది. తర్వాత సంఘానికి ఎన్నికలు జరిగాయి; అధ్యక్షుడుగా శ్రీ పి. వి. శేషయ్య, ఉపాధ్యక్షుడుగా శ్రీ పి. మోహనరావు, కార్యదర్శిగా శ్రీ వి చంద్రమౌళి, సహాయ కార్యదర్శిగా శ్రీ ఆర్. శ్రీనివాసరావు, కోశాధికారిగా శ్రీ జి. సూర్యనారాయణ ఎంపికైనారు.

## సింహపురి

## నేతాజీ స్మారకంగా వ్యాసరచన పోటీలు

స్టేట్‌వైడ్ కృష్ణంరాజు యువసేవ అసోసియేషన్ల అధ్వర్యంలో, నేతాజీ సుభాస్‌చంద్రబోస్ స్మారకంగా 28 తేది నెల్లూరులో వ్యాసరచన పోటీలు జరిగాయి. పోటీలలో సి. మాధవి (స్వామిదాస్ కాన్వెంట్) శ్యామ్ సుందర్ (సిపిఎం) ఎల్ ప్రసాద్ (మైపాడు) ప్రథమ,

—కారవ 10వ పేజీలో

# గిల్డ్ ఆఫ్ సర్వీస్ భవనం మునిసిపాలిటీ స్వాధీనమైంది!

మద్రాసు బస్టాండు ప్రక్కన, జాబిలీ ఆస్పత్రి ఎదురుగానున్న గిల్డ్ ఆఫ్ సర్వీస్ భవనాన్ని మునిసిపాలిటీ తిరిగి స్వాధీనం చేసుకున్నది. 4 తేది ఉదయం మునిసిపల్ కమీషనర్ శ్రీ ఎస్. ఎ. సత్తార్ మందీ మార్బలంతోవెళ్ళి, తాళాలు పగులగొట్టి, లోపలున్న చిల్లరమల్లర వస్తువులు స్వాధీనంచేసుకొని, మునిసిపల్ ప్రాథమిక పాఠశాల అనే బోర్డును తగిలించివచ్చారు.

జనవరి 19 తేది జమీన్‌రైతు సంచికలో వచ్చినవార్తననుసరించి అధికారులు తీసుకున్నచర్య ఇది. మాజీ శాసనసభ్యురాలు, సేవ సర్వస్వమైన్యార్యకురాలు శ్రీమతి కె. నారాయణమ్మ ఈ భవనాన్ని, స్థలాన్ని ఆక్రమించుకొన్న విషయం తెలిసిందే! పత్రిక ద్వారా ఈ దుర్మార్గంగురించి తెలుసుకున్న కలెక్టర్ శ్రీ కె. రాజు రెవిన్యూ మునిసిపల్ అధికారులందరినీ పిలిపించి, ఏవి

> కలెక్టర్ జోక్యంతో
> నారాయణమ్మ
> ఆక్రమణ కథ
> సుఖాంతం!

ధంగాలైనా ఆ ప్రభుత్వ ఆస్తిని తిరిగి స్వాధీనం చేసుకోవాలని ఆదేశించారు. నారాయణమ్మ దీనిపై హైకోర్టులో కేసు వేసివున్నదృష్ట్యా, న్యాయపరమైన చిక్కులు ఎదురుకాకుండా వ్యవహారం నడిపించవలసివచ్చింది. నేరుగాపోలీస్‌కాని, రెవిన్యూఅధికారులుకాని లోపలకు అడుగు పెడితే కోర్టుధిక్కరణ నేరం చుట్టుకొనే ప్రమాదం కన్పించడంతో; ఈ స్థలానికి మునిసిపాలిటీ యజమానురాలు కావడంతో; ఆర్. డి. ఓ., ఎం. ఆర్. ఓ తదితర అధికారులు మునిసిపల్ గెస్టుహౌస్‌లో విడిదచేసి, కమీషనర్‌మున్మాత్రం భవన స్వాధీన కార్యక్రమానికి వినియోగించారు.

అధికారులు వెళ్ళేసమయానికి శ్రీమతి నారాయణమ్మ అక్కడలేదు కమీషనర్ భవనంలోపలి మంచాలు, పెట్టెలు, గిన్నెలు గ్లాసులవంటి పాత్రసామగ్రి తదితరాలను 6 ట్రాక్టర్లనిండా స్వాధీనంచేసుకున్నారు వాటన్నిటికీ పంచనామాకూడా జరిపారట. సామాను వంపేసమయంలో శ్రీమతి నారాయణమ్మ అక్కడకు వచ్చిందట; అధికారులు అన్నివిధాలా సన్నాహాలు చేసుకొని వచ్చారని తెలియడంవల్ల కాబోలు ఆమె పెద్దగా ప్రతిబంధకాలు కల్పించకుండానే వెళ్లిపోయారు.

మునిసిపల్ కమీషనర్ చెపుతున్న వివరాల ప్రకారం ఈ స్థలం వైశాల్యం 269 అంకణాలేనట. 1955 మార్చి 31 తేది గిల్డ్ ఆఫ్ సర్వీసెస్‌కు 10 సంవత్సరాల లీజు ప్రాతిపదికపైన ఇచ్చారని, 1956 లో భవనం కట్టారని, 1966 లో లీజు గడువు పూర్తయిన

—కారవ 11వ పేజీలో






ఎడమవైపు: 8 తేది నెల్లూరులో జరిగిన జిల్లా రైతు సదస్సులో ప్రసంగిస్తున్న వ్యవసాయ మంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి; చిత్రంలో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ప్రభృతులు కూడా వున్నారు
కుడివైపు: ఈ సందర్భంలో ఏర్పాటైన వ్యవసాయ ప్రదర్శనకు రిబ్బన్ కత్తిరిస్తున్న జనార్ధనరెడ్డి; ఆయనకు ఎడమవైపు కలెక్టరు కె. రాజు, జి. ప్ర. ప. ఛేర్మన్ దేగా నారసింహారెడ్డి

# అదేముహూర్తంలో రైతుసదస్సే!

రైతు అన్న పదమే ఒక రాజకీయ నినాదంగా, కొందరికి రాజకీయవినాదంగా మారిపోయిన సమయంలో రైతు సదస్సులలో రాజకీయాలు మినహా మరేమీ ఆశించక పోవడం పొరపాటేమీ కాదు. ప్రతిరాజకీయ పార్టీ తమకనుబంధంగా ఒక రైతుసంఘం పెట్టుకొని, రాజకీయావసరం తలెత్తినప్పుడల్లా సభలు సమావేశాలు జరిపి రైతులపట్ల మొసలి కన్నీరు కార్చి, ఉపన్యాసాలు దంచి, దక్కాల్సిందేదో దక్కించుకోవడం మనకు తెలిసిందే. వ్యవసాయ మంత్రి శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి రైతు

## రైతు సభలకు ఒరవడిదిద్దాడు మంత్రి జనార్ధనరెడ్డి

సదస్సు జరుగుతుందని ప్రకటించినప్పుడూ, ఇదీ ఆ కోవలోనిదే అని అందరూ భావించారు కానీ తీరా సదస్సును ఆమూలాగ్రం చూసినతర్వాత ఆ అభిప్రాయం తల్లక్రిందులు కాకతప్పలేదు.

అయితే మామూలు సభలనుకూడా, మామూలుకు భిన్నంగా ఎట్లా మల్చవచ్చో చూపించారు శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి. 8 తేది ఉదయం కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన రైతుసదస్సు చూసిన వారికి, ప్రభుత్వ నిర్వహణలో జరిగిన సభలంటే నమ్మబుద్ధికాలేదు. కార్పొరేట్ కంపెనీలు నిర్వహించిన సెమినార్ వలె వుందది. మనకు తెలిసిన సదస్సులంటే తిమ్మిని బమ్మిని చేసే మెహర్బానీ పొగడ్తలు, ప్రశంసలు, వేడి వేడి ఉపన్యాసాలు, మాటుమాటు తీర్మానాలు మాత్రమే! కాని అవి ఇక్కడ లేవు. చర్చలు, సలహాలు, సాధ్యాసాధ్య పరిశీలనలు, నిర్మొగమాటపు అభిప్రాయ వ్యక్తీకరణలతో ఈ రైతు సదస్సు కొత్త వొరవడితో సరికొత్త పోకడతో వినూత్నంగా వుండింది

ఉదయం కళాక్షేత్రంలో సదస్సు ప్రారంభం; ఎమ్మెల్యేలాది వక్తలు రైతు సమస్యలను స్థూలంగా ప్రస్తావించారు; మధ్యాహ్నంనుంచి పోలీసు పెరేడ్ గ్రౌండ్స్‌లో షామియానాల క్రింద చర్చా గోష్ఠులు — ఉదయం సదస్సులో ప్రస్తావనకు వచ్చిన సమస్యలను వర్గాలుగా క్రోడీకరించి సంబంధిత అధికారులు, శాస్త్రవేత్తలు రైతులు కూలంకషంగా చర్చలు జరిపారు. తిరిగి సాయంత్రం కస్తూరిబా కళాక్షేత్రంలో ఆ చర్చల సారాంశాన్ని వివరించి, సాధ్యమయ్యే పరిష్కారాలు ఏమిటి, వాటి అమలుకు తీసుకోదగినచర్య లేమిటని నిర్ణయించుకున్నారు.

ఈ సదస్సుకోసం జనార్ధనరెడ్డిగారు వ్యవసాయానికి సంబంధించిన ఉన్నతాధికారులు, శాస్త్రవేత్తలందరినీ నెల్లూరు రప్పించారు ఆయిల్ సీడ్స్ ఫెడరేషన్ ఎం.డి. శ్రీ హెచ్ కె. బాబు, ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్ ఎం.డి. శ్రీ జయప్రకాష్ నారాయణ్, వ్యవసాయ విశ్వవిద్యాలయం శాస్త్రవేత్త శ్రీ సుబ్బారావు, హార్టీకల్చర్ డైరెక్టర్ అబ్దుర్ కలాం, డైరీ కార్పొరేషన్, సహకార శాఖాధికారులు, తిరుపతికిచెందిన వ్యవసాయ శాస్త్రవేత్త డాక్టర్ ఎం. ఎస్. సౌందరరాజన్ ప్రభృతులు, పట్టుపరిశ్రమడైరెక్టరు ఇంకా పలువురుఅధికారులు సదస్సుకువచ్చారు.

సభావరణ అలంకరణలో కలెక్టరు, వ్యవసాయ శాఖాధికారులు అనుభవజ్ఞులు చేసినంతా ప్రదర్శింపజేశారు. మామూలు బ్యానర్లు, స్వాగతద్వారాలు కట్టలేదు. వరి వెన్నులతో, చెరకుగడలతో అరటిస్తంభాలతో ఆ వేదికంతటినీ శోభాయమానంగా అలంకరించారు. ఎంతో వాయిదులావలె దుస్తులు వేసుకున్న చిన్నపిల్లలు ఆతిధులకు పల్లెటూరిపద్ధతిలో స్వాగతం చెప్పారు.

వ్యవసాయ ప్రదర్శనకూడా జరిగింది. వ్యవధి లేకపోవడం, స్థలం ఇరుకైనందువల్ల కాబోలు అదంత ఆకర్షణీయంగా తయారు కాలేదు. సంబంధిత శాఖాధికారులు మొక్కుబడిగా లోపాలు జరిగించి ఎగ్జిబిషన్ అన్పించారు.

సదస్సుకు స్వాగతం చెప్పింది, వ్యవసాయశాఖ జాయింట్ డైరెక్టర్ శ్రీ జి కోటిరెడ్డి. కలెక్టరు శ్రీ కె. రాజు, ఎమ్మెల్యేలు, మండలాధ్యక్షులు, ఎం పి టి, జి ప్ర.ప. ఛేర్మన్ శ్రీ దేగా నారసింహారెడ్డి, షుగర్ ఫ్యాక్టరీ ఛేర్మన్ శ్రీ సోమంతు సుబ్బారెడ్డి అధికారులు, కొందరు రైతు ప్రముఖులు వేదికపై కూర్చున్నారు. అంత విశాలమైన వేదికకూడా కిటకిటలాడిపోయింది. ప్రేక్షక రైతులతో హాలు పట్టలేదు. తమకోసం జరిగే సభలకు అంత ఉత్సాహంగా రైతులు కదలిరావడం ఆశ్చర్యం కల్గించే విషయమే.

ఊరికే రావడంకాదు - చర్చలలోనూ ఎంతో చొరవచూపారు రైతులు. మంత్రి వున్నారని, అధికారులు వింటారనే జంకు లేకుండా తమ సమస్యలను స్పష్టమైన భాషలో, నిర్మొగమోటంగా వ్యక్తంచేశారు; అధికారుల అవినీతిని వుతికివదిలారు; ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు! రైతులింత పరిత్యక్షరాడికి పూనుకోవడానికి ఒక విధంగా జనార్ధనరెడ్డే కారణమన్నా అనవచ్చు. తన స్వాగతోపన్యాసంలో సదస్సు లక్ష్యాలు వివరిస్తూ, పొగడ్తలకోసమో, లేక

తియతియ్యనిపొగడ్తలు, గిలిగింతలు పెట్టే ప్రశంశలు సదస్సులో కలికానికికూడా కానరాలేదు- మంత్రి వున్నాడని, కలెక్టరాది అధికార గణం వుందని రైతులు జంకలేదు; తమ సమస్యలను స్పష్టమైన మాటల్లో నిర్మొగమోటంగా వ్యక్తంచేశారు; అధికారుల అవినీతిని వుతికి వదిలారు, ప్రభుత్వాన్ని నిశితంగా దుయ్యబట్టారు!

రాజకీయ లబ్ధికోసమో కానీ సదస్సు జరపడంలేదనీ, రైతు సమస్యలను నేరుగా విని, అవగాహన చేసుకొని, తన శాఖను రైతులకు సన్నిహితం చేయడం కోసమే ఈ ఏర్పాటు చేశామని, అందువల్ల రైతులు సంకోచం లేకుండా నిర్మాణాత్మక సూచనలు చేయాలని కోరారు శ్రీ జనార్ధనరెడ్డి.

సదస్సులో చర్చకువచ్చిన సమస్యలు, సూచనలు పరిష్కార మార్గాలు స్థూలంగా ఇవీ—

—కొనస 7 వ పేజీలో

